ఒక్కసారి సంకీర్తన మొనరించిన చిత్తతృప్తి కలుగును. త్రిశతి జపించువానికి ఇతరమును తెలుసుకొనవలసిన ఆవశ్యకత, ఇతర జపముల ఆవశ్యకతలేదు.

యద్యత్సాధ్యతమం కార్యం తత్తదర్థమిదం జపేత్
తత్తత్ఫలమవాప్నోతి పశ్చాత్కార్యం పరీక్షయేత్ 48

ఏ కార్యమునైన సాధింపదలచినవారు ఈ జపమునొనరించిన ఆ ఫలము కలుగును

యే యే ప్రయోగాస్తంత్రేషు తైస్తైర్యత్సాధ్యతే ఫలమ్
తత్సర్వం సిధ్యతి క్షిప్రం నామత్రిశతకీర్తనాత్ 49

ఏ ఫలము నుద్దేశించి ఏ ప్రయోగములు తంత్రములందు చెప్పబడినవో అవి యన్నియు నామత్రిశతీకీర్తనము వలన సిద్ధించును.

ఆయుష్కరం పుష్టికరం పుత్రదం వశ్యకారకమ్
విద్యాప్రదం కీర్తికరం సుకవిత్వప్రదాయకమ్ 50
సర్వసంపత్ప్రదం సర్వభోగదం సర్వసౌఖ్యదమ్
సర్వాభీష్టప్రదం చైవ దేవ్యా నామశతత్రయమ్ 51

ఈ త్రిశతి ఆయుష్కరము, పుష్టికరము, పుత్రుల నిచ్చునట్టిది, ఇతరులను వశ్యులగ చేయునట్టిది. విద్యాప్రదము, కీర్తికరము, కవిత్వప్రదము, సంపత్ప్రదము, భోగప్రదము, సౌఖ్యప్రదము, సర్వాభీష్టప్రదమై యున్నది.

ఏతజ్జపపరో భూయాన్నాన్యదిచ్ఛేత్ కదాచన
ఏతత్కీర్తనసంతుష్టా శ్రీదేవీ లలితాంబికా 52
భక్తస్య యద్యదిష్టం స్యాత్ తత్ పూరయతే ధ్రువం
తస్మాత్ కుంభోద్భవ మునే కీర్తయ త్వమిదం సదా 53

కావున త్రిశతీజపపరుడై యుండవలెను. ఇతరమును కోరనక్కరలేదు. ఈ కీర్తనముచే సంతుష్టయై లలితాంబిక భక్తున కేది యిష్టమో దాని నిచ్చును. కావున కుంభసంభవ! నీవు దీనినే కీర్తించుచుండుము.

అపరం కించిదపి తే బోద్ధవ్యం నాఽవశిష్యతే
ఇతి తే కథితం స్తోత్రం లలితాప్రీతిదాయకమ్ 54

నాకింక చెప్పవలయున దేదియు లేదు. లలితాప్రీతిదాయకమగు స్తోత్రము నీకు చెప్పియుంటిని.

నాఽవిద్యావేదినే బ్రూయా న్నాఽభక్తాయ కదాచన
న శఠాయ నదుష్టాయ నాఽవిశ్వాసాయకర్హిచిత్ 55

అవిద్యావంతునకు, ఆ భక్తునకు, శఠునకు, దుష్టునకు, విశ్వాసరహితునకు ఈ నామత్రిశతి చెప్పకూడదు.

యో బ్రూయా త్త్రిశతీం నామ్నాం తస్యాఽనర్థో మహాన్ భవేత్
ఇత్యాజ్ఞా శాంకరీ ప్రోక్తా తస్మాత్ గోప్య మిదం త్వయా 56

అర్హులు కానివారికీ త్రిశతిని చెప్పినయెడల గొప్పదగు అనర్థము సంభవించును. ఇది శంకరుని ఆజ్ఞ. కావున నీవు దీనిని గోప్యముగనుంచుము.

లలితాప్రేరితేనైవ మయోక్తం స్తోత్ర ముత్తమం
రహస్యనామ సాహస్రా దపి గోప్య మిదం మునే 57

లలితాదేవి ప్రేరణముచే నీకు నేనీస్తోత్రమును చెప్పియుంటిని. దీనిని రహస్యనామసాహస్రము కంటె గోప్యముగనుంచవలెను.

ఏవ ముక్త్వా హయగ్రీవః కుంభజం తాపసోత్తమం
స్తోత్రేణాఽనేన లలితాం స్తుత్వా త్రిపురసుందరీమ్ 58
ఆనందలహరీ మగ్నమానసః సమవర్తత

ఇట్లు హయగ్రీవుడు కుంభజున్మునకు చెప్పి, ఈ స్తోత్రముతో లలితను త్రిపురసుందరిని స్తుతించి ఆనందప్రవాహ మగ్నమానసుడై యుండెను.

ఇతి శ్రీ బ్రహ్మాండపురాణే ఉత్తరఖండే హయగ్రీవాఽగస్త్య సంవాదే
స్తోత్రఖండే ఉత్తరఖండే లలితాత్రిశతీ స్తోత్రం సంపూర్ణమ్.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

